# మన ధర్మం

## మరవ కూడని మన మూలాలు....




శ్రీ రాం ...

భారత్ పబ్లికేషన్స్, విజయవాడ



సనాతన ధర్మము నా నిత్య రూపము।
ఆ రూపములో ఎల్లప్పుడూ సర్వత్రా ఉండెదను ॥

పరమ పూజ్య భక్తరాజ్ మహారాజ్ ప్రియ శిష్యుడు

## డా॥ జయంత్ బాళాజి ఆఠవలె గురువులు

సనాతన ధర్మమే తమ నిత్య విరాట్ స్వరూపమైన మీ దివ్య చరణాలకు సాష్టాంగ నమస్కారాలు. ఆ రూపమే ఈ అల్ప జీవి ద్వారా ఈ కార్యం చేయించుకొన్నందుకు, ఈశ్వరీ రాజ్య స్థాపనా కార్యములో మాలాంటి అల్పులను చొప్పించి మా జన్మ సార్థకము గావించు ప్రయత్నానికి కృతజ్ఞతలు తప్ప చెప్పకోవడానికి నా వద్ద మాటలులేవు. సదా మీ కృపా దృష్టి మాపై ఉండాలని ప్రార్థిస్తూ....

* 50 అంతకంటే ఎక్కువ కాపీలు తీసుకునే వారికి వారి పేరు ముద్రించి ఇవ్వబడును.

# మన ధర్మం ... మరవకూడని మన మూలాలు


సంకలనం : శ్రీ రాం

టైపింగ్ : కుమారి గంటా అఖిల

ముద్రణ : ప్రథమ ముద్రణ 3000 కాపీలు (శ్రీ విజయనామ సంవత్సరం విజయదశమి -2013)
ద్వితీయ ముద్రణ 3000 కాపీలు (శ్రీ జయనామ సంవత్సరం ఉగాది -2014)
తృతీయ ముద్రణ 10,000 కాపీలు (శ్రీ మన్మథనామ సంవత్సరం ఉగాది -2015)

పబ్లిషర్స్ : భారత్ పబ్లికేషన్స్, విజయవాడ. E-mail : bharathpublications.ap@gmail.com

ముద్రణ : నాగశివ డిజైనర్స్ & ప్రింటర్స్, గాంధీనగర్, విజయవాడ.

అర్పణ : రూ. 25-00

కాపీలకు : 92464 00661, 92926 57795, 90109 87273.


మనవి : ఈ పుస్తకంలో ప్రకటించిన విషయాలు జాతిని జాగృతి గొల్పి దేశ - ధర్మాలను కాపాడి మన దేశానికి పూర్వవైభవ స్థితి తీసుకురావాలనే ఉద్దేశ్యంతో చేసిన చిరు ప్రయత్నము. ఈ మహత్కార్యములో మీ వంతుగా ఇందులోని విషయాలను భావి భారత పౌరులైన మన విద్యార్థులకు తెలిపేందుకు ఈ ప్రదర్శనను (ఎగ్జిబిషన్‌ను) కళాశాలలో, పాఠశాలలో, శుభకార్యాలలో మొ॥ చోట్ల ప్రదర్శించుటకు తోడ్పడగలరు.

మీరు శుభకార్యాలలో బహుమతులుగా, మరుపురాని గుర్తులుగా ఈ పుస్తకాన్ని ఇవ్వవచ్చును. ఫ్లెక్సీలు చేసి పాఠశాలలు, దేవాలయాలు మొ॥చోట్ల ఏర్పరచవచ్చును. తద్వారా మన మహోన్నత సంస్కృతి గొప్పతనాన్ని, దానిని సర్వనాశనం చేయజూస్తున్న శక్తులు, దానిని పరిరక్షించుకోవలసిన ఆవశ్యకతను తెలియజేసినవారగుదురు. ఈ చిన్నపని ద్వారా మనం ఈ దేశం, సంస్కృతికి గొప్ప ఉపకారం చేసిన వారవుతాము. ఈ దేశ వారసులుగా కనీసం ఈపాటి చిన్న సేవ చేయలేమా ?

మీ సూచనలు, సలహాలు, సవరణలు పంపవచ్చును. ఈ పుస్తకంలో పొందుపరిచిన అందమైన అనేక చిత్రాలు సనాతన సంస్థ నుండి సేకరించబడినవి. వారికి హృదయపూర్వక ధన్యవాదాలు.



**ఈ పుస్తకములోని విషయాలతో కూడిన "మన సంస్కృతి" ఎగ్జిబిషన్ ను కళాశాలల్లో, జాతర్లలో, వివిధ కార్యక్రమాలలో ప్రదర్శించుటకు సంప్రదించండి.**

**సంప్రదించుటకు : 092464 00661, 092465 62996**

# ॥ దీపం ఆర్పొద్దు ॥

| పాశ్చాత్య సంస్కృతిని పారద్రోలండి | హిందూ సంస్కృతినే పాటించండి |
|---|---|
|  |  |
| **దీపాలు ఆర్పి పుట్టిన రోజును జరుపుకోకండి** | **హారతినిచ్చి పుట్టిన రోజును జరుపుకోండి** |

సుఖసంతోషాలతో, ఆయురారోగ్యాలతో, సిరిసంపదలతో....సుఖంగా ఉండాలనే అనేక పూజలు, పండుగలు చేస్తాము. అందులో భాగంగానే పుట్టిన రోజు పండుగను జరుపుకొంటాము. కాని కొద్ది కాలంగా విదేశీయుల, టి.వి.ల ప్రభావం కారణంగా కేవలం ఆడంబరం కోసం అశాస్త్రీయంగా పుట్టిన రోజు పండుగను జరుపడంవల్ల మేలు జరిగేమాట అటుంచితే కీడు మాత్రం తప్పక జరుగుచున్నది. కేకుపై వెలుగుచున్న దీపాలను ఆర్పేసి, కేకుపై ఉండే పేరు, కాస్త ఎక్కువైతే ఫోటో కూడా ఉంటుంది. దానిని చాకుతో మర్డర్ చేసిట్లుగా ముక్కలు ముక్కలుచేసి ఆ ముక్కల్ని తిని హ్యాపీ బర్త్‌డే టూ...యూ... అంటూ కేరింతలు కొడతాం. ఒక్కసారి ఆలోచించండి; దీపం ఆర్పటం శుభమా? అశుభమా? (ప్రాణం పోయినదానికి సూచిక దీపం ఆరిపోవడం) దీనినుండి ఆయుష్షు పెరుగుతుందా? తగ్గుతుందా? తర్వాత కేకుపైనున్న తమ పేరును కోయడం వల్ల పేరులో ఉండే మన ప్రాణశక్తికి హాని జరుగుతుంది. అంతేకాదు ఆహారం(కేక్) దేవుడితో సమానం అలాంటి పవిత్రమైన దానిని ఆయుధంతో కోయడం దానిని అవమానించడం కాదా? ఇలా ఎన్నో తప్పులు చేస్తూ; పిల్లలకు మంచి సంస్కారము నేర్పకపోవడము వల్ల వారు తల్లిదండ్రుల పట్ల ఆగౌరవంగా ప్రవర్తించడం, అల్లరి చిల్లరగా పెరగడం, దురలవాట్లకు లోనుకావడం, రోగాలు, ఆయుష్షు క్షీణించడం మొదలగునవి జరుగుచున్నవి.

పుట్టిన రోజున దేవాలయానికెళ్లి దేవుని ఆశీస్సులు, పెద్దల ఆశీస్సులు పొందాలి, హారతి చేయించుకోవాలి, అలానే ధర్మప్రచార కార్యానికి వారి చేతుల మీదుగా దానం చేయించాలి.

మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా **'పుట్టిన రోజు జరుపుకునే విధానం'** పుస్తకాన్ని చదవండి.

**" నువ్వు చేసే పనులు అవతలివారిలో స్ఫూర్తిని కలిగించి ఉత్సాహాన్ని నింపి నేర్చుకోవడానికి అవకాశం ఇస్తున్నాయంటే నువ్వే నాయకుడివి "**

హీన సంస్కృతి మనకొద్దు




**జనవరి 1ని నూతన సంవత్సరంగా జరుపుకోకండి**

హిందూ సంస్కృతే ఎంతోముద్దు !



ఉగాది పచ్చడి, పంచాంగ శ్రవణం తప్పకుండా చెయ్యాలి....

**ఉగాది పండుగ రోజును నూతన సంవత్సరంగా జరుపుకోండి**

జనవరి 1న కొత్త సంవత్సరం అనడానికి ఏవిధమైన శాస్త్రీయ ఆధారములేదు. ఆ రోజు ప్రకృతిలో గాని, సమాజంలోగాని ఏ విధమైన మార్పురాదు. అన్ని రోజుల మాదిరిగానే ఆరోజూ గడియారంలో ముల్లు మాత్రమే మారుతుంది. ఏ మాత్రము సూక్ష్మ జ్ఞానములేని బ్రిటీష్ దోపిడిదారులు పాలిస్తున్నప్పుడు వారి మతాన్ని, తుచ్ఛ అలవాట్లను, సంస్కృతిని బలవంతంగా మనపై రుద్దారు. పర్యవసానం డిసెంబరు 31న అర్ధరాత్రి కొత్త సంవత్సరం వేడుక పేరుతో అమ్మాయిలు-అబ్బాయులు తాగడం, చిందులేయడం, విచ్చల విడిగా తిరగడం, పబ్బుల్లో గబ్బుగబ్బుగా గడపడం చూస్తూనే ఉన్నాము. ఇదా పండుగ? దీనిద్వారా ప్రమాదాలేకాదు మనకు తీరని నష్టం జరుగుచున్నది. ఆలోచించండి.

ఎంతో సూక్ష్మజ్ఞానము కలిగిన మన ఋషులు కోట్ల సంత్సరాల మునుపే బ్రహ్మదేవుడు సృష్టిని నిర్మించిన రోజును కొత్త సంవత్సరంగా నిర్ణయించారు. దానినే 'యుగాది' అంటే యుగము పుట్టిన రోజని అర్థము. అందుకే ఉగాదిరోజు చెట్లు చేమలు చిగురిస్తాయి, ప్రకృతి పులకరిస్తుంది. కొత్త సంవత్సమనడానికి ఇంతకన్నా ఏ నిదర్శనం కావాలి. రండి మన సంస్కృతి గొప్పతనాన్ని తెలుసుకుందాం మన తోటివారికి తెలియజేద్దాం !

బానిసత్వం నుండి బయటపడి 65 సంవత్సరములు అయ్యింది....

ఇకనైనా బానిస సంస్కృతి సంకెళ్ళ నుండి బయటపడండి.

మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా '**నూతన సంవత్సరం ఉగాది పండుగ జరుపుకునే విధానం**' పుస్తకాన్ని చదవండి.

**గ్రహాలు, నక్షత్రాల గమనాన్ని బట్టి చెప్పే జాతకాలు ఖచ్చితంగా ఉంటాయనే విషయాన్ని వరహ మిహురుడు 1500 సం॥ల పూర్వమే నిరూపించాడు.**

# ॥ హ్యాండివ్వొద్దు ॥

**విదేశి మోజు మనకొద్దు**



**కరచాలనం(షేక్యాండ్)తో స్వాగతించుకోకండి**

**విలువైన పద్ధతే ఎంతోముద్దు**



**సంస్కారమైన నమస్కారంతో స్వాగతించుకోండి**

ఒకరినొకరు కలుసుకొన్నప్పుడు స్వాగతించుకోవడం సంస్కారం. కానీ అది మన ఆరోగ్యానికి, సంస్కృతి సాంప్రదాయాలకు హానికలిగించనిదై ఉండాలి, నేడు ప్రతిఒక్కరు కరచాలనంతో  స్వాగతించుకోవడం అంతటా కనబడుచున్న దృశ్యం. ఒకరితో మరొకరు చేతులు కలపడం వలన ఒకరిలోని తామసిక (చెడు/దుష్ట) శక్తులు మరొకరిలో ప్రవేశించవచ్చును. దూరదృష్టితో ఈ ప్రమాదాన్ని గుర్తించిన మన ఋషులు చేతులు జోడించి నమస్కారంచేయు సంస్కారవంతమైన పద్ధతిని తెలియజేశారు. దానినే మన సంస్కృతి అన్నారు. ఇలా నమస్కరించుకోవడం ద్వారా పరస్పరం ఎంతో గౌరవ అభిమానాలు కూడా కలుగుతాయి. ప్రయోగంద్వారా కూడా తెలుసుకోవచ్చును.

అంతేకాదు ఈ మధ్య కాలంలో ప్రాణాంతకమైన ప్రమాదకర "స్వైన్‌ఫ్లూ" వ్యాధి వచ్చినపుడు ఒకరితో ఒకరు చేతులు కలపవద్దని అలా కలిపితే ఒకరినుండి ఇంకొకరికి వ్యాధి సోకుతుందని కూడా చెప్పారు. అంటే ఈపద్దతి ద్వారా అంటురోగాలు సోకే ప్రమాదము కూడా ఉన్నది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవం ఉత్తముడి లక్షణం కాదు. ఇలాంటి నష్టాలు జరుగకూడదనే ఉద్యేశంతో సూక్ష్మ దృష్టితో ఆలోచించి మన ఋషులు చెప్పిన శ్రేష్టమైన సంస్కృతినే ఆచరిద్దాం.

నమస్కారం మన సంస్కారం దానినే ఆచరిద్దాం.

మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా '**మన పద్ధలు శాస్త్రీయత**' పుస్తకాన్ని చదవండి.

**లక్షల సంవత్సరాల యోగిలాంటి భారతీయ సంస్కృతి, భోగిలాంటి 1000 సం॥ల అరేబియా, 200 సం॥ల పాశ్చాత్య సంస్కృతి పాలనతో రోగి అయినది. ఇకనైనా మేల్కొందాము.**

## ॥ కట్ చేస్తే... ॥

**వినాశ సంస్కృతిని వదిలేద్దాం**



**రిబ్బన్ కత్తిరించి ప్రారంభిస్తే**
**వాస్తుకు ఇబ్బంది అవుతుంది**

**వైభవ సంస్కృతినే పాటిద్దాం**



**కొబ్బరికాయకొట్టి ప్రారంభిస్తే**
**వాస్తు శుద్ధి అవుతుంది**

మన శాస్త్రాలను మనం తెలుసుకోకపోవడం వల్ల మనం మన జీవితంలో ఎంతో నష్టపోతాం. సాధారణంగా ప్రతి శుభ/అశుభ కార్యము జరుపుకోవడానికి ఒక యోగ్యమైన పద్ధతి ఉంటుంది. అవి మనం తెలుసుకోకపోవడం వల్ల టి.వి. లలో చూపిందే గుడ్డిగా మనమూ చేయడం వల్ల ఎన్నో అనర్థాలు చవిచూడాల్సి వస్తుంది. ఏదైనా కొత్త భవంతినిగాని, వ్యాపారాన్నిగాని, కార్యక్రమాన్నిగాని ప్రారంభించుటకు ముందు ఆప్రదేశంలో కొబ్బరికాయ కొట్టి శాంతిజరిపితే అక్కడ ఏవైనా అనిష్టశక్తులు ఉంటే వాటి నిర్మూలన జరుగుతుంది. ఇలా చేయడం వలన ఆ వాస్తులో తలపెట్టిన కార్యము దిగ్విజయంగా ముందుకెళుతుంది. ఎందుకంటే కొబ్బరికాయలో దుష్టశక్తులను ఆకర్షించి నాశనం చేసే గుణం ఉంటుంది. కాబట్టి ఏ కార్యక్రమమైనా కొబ్బరికాయ కొట్టనిదే ప్రారంభించగూడదని మన పూర్వికులు చెప్పారు.

కాని పాశ్చాత్య సంస్కృతి దాడి కారణంగా క్రమేపీ మనం మన సంస్కృతికి దూరమవుచున్నాము. ఇది తెలియక చాలా మంది ఆడంబరానికి పోయి రిబ్బన్ కటింగ్‌తో ప్రారంభోత్సవం జరుపుతుంటారు. అలా జరపడం వల్ల వాస్తుశుద్ధి మాట ఏమోగాని. కత్తిరించిన క్రియ వల్ల ఆ స్థలంలో చెడు స్పందనలు నిర్మాణమౌతాయి. మనమెంత మన సంస్కృతికి దూరమౌతామో అంత దుఃఖాలు అనుభవిస్తాము. నేడు మనం చూస్తున్న ప్రపంచం అందులోనే కొట్టుమిట్టాడుచున్నది.

రండి మన సంస్కృతి గొప్పతనాన్ని తెలుసుకుందాం మన తోటివారికి తెలియజేద్దాం.
మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా '**ప్రారంభోత్సవం జరుపుకునే విధానం**' పుస్తకాన్ని చదవండి.

" విజయవంతమైన వ్యక్తిగా గుర్తింపు తెచ్చుకోవడానికి ప్రయత్నించవద్దు - విలువలతో కూడిన విజయాన్ని సాధించిన వ్యక్తిగా నిలబడేందుకు ప్రయత్నించు "

# ॥ కొవ్వొద్దు ॥

| విష సంస్కృతిని వదిలేద్దాం | మన సంస్కృతినే పాటిద్దాం |
| --- | --- |
|  |  |
| తమోగుణి (హానికర) క్రొవ్వొత్తితో దీపప్రజ్వలన చేయకండి | శుభకరమైన నూనెదీపంతోనే దీపప్రజ్వలన చేయండి |

ఏదేనీ కార్యక్రమం దీపప్రజ్వలనతో (దీపం వెలిగించి) మొదలుపెడతాం. ఎందుకంటే దీపం జ్ఞానానికి ప్రతీక అవుతుంది. కాబట్టి కొండంత చీకటినైనా చిన్న దీపం పటాపంచలు చేస్తుంది. అలాగే దీపం వెలిగించడం వల్ల సాత్విక (దైవ) స్పందనలు ఆ స్థలానికి చేరుకొంటాయి. ఫలితంగా అక్కడ విజయం సాధించు ప్రేరణ లభిస్తుంది. కావున అనాదిగా మన దేశంలో ప్రతి ఇంట్లో ఉదయం, సాయంత్రము దేవుడి దగ్గర దీపంవెలిగించే ఆచారమున్నది. దీపం లేని ఇంట్లో దరిద్రం తాండవిస్తుందంటారు. దీపప్రజ్వలనను నీలాంజనముతోనే చేయవలెను.

కానీ నేటి తీరికలేని ప్రపంచంలో నీలాంజన దీపం తయారుచేసుకొనే ఓపిక లేక పశువుల కొవ్వు, రసాయనాలతో తయారు చేసినటువంటి క్రొవ్వొత్తితో దీపప్రజ్వలన చేసేస్తుంటారు. ఇలా క్రొవ్వొత్తితో దీపప్రజ్వలన చేయడం వలన వాతావరణంలో చెడు స్పందనలు వెలువడుతాయి. తలపెట్టిన కార్యానికి పూర్తిగా విజయావకాశాలు లభించడంలో ఇబ్బందులు తలెత్తుతాయి. కావున పేరుకు దీపప్రజ్వలన చేస్తున్నామన్నట్లు చేయకుండా శ్రద్ధతో సాత్త్విక స్పందనలు అందించే, విజయం చేకూర్చే నీలాంజన దీపంతోనే దీపప్రజ్వలన చేయండి.

దీపాన్ని వెలిగిద్దాం దేదీప్యమానంగా జీవిద్దాం

మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా **'దీప ప్రజ్వలన చేయు విధానం'** పుస్తకాన్ని చదవండి.

**" మానవమనుగడయొక్క ప్రారంభదశ నుండి, ఈ లోకంలో మానవుల సర్వ ఆదర్శాలకూ, స్వప్నాలకూ ఆటపట్టైన ప్రదేశం ఏమన్నా వుందా అంటే అది భారతదేశమే "**

# ॥ హుందాగా ఉండు ॥

భావదాస్యమును వదలండి



తామసిక వస్త్రధారణ చేయకండి.

భవ్య జీవనం గడపండి



సాంప్రదాయ వస్త్రధారణ చేయండి

మన కట్టు, బొట్టు, దుస్తులు, మన మానాన్ని కాపాడటమేకాకుండా అనుకూలత, ఆరోగ్యము, హుందాతనము, సంస్కృతి ప్రతిబింబించే విధంగా ఉండాలి. ఒక వ్యక్తి ధరించిన వస్త్రధారణ బట్టి ఆ వ్యక్తిపై మంచి లేక చెడు అభిప్రాయాలు కలుగుతాయి. అనేక నేరాలలో రెచ్చగొట్టే దుస్తులు కూడా కారణమవుచున్నాయి. అందుకే మంచి వ్యక్తిత్వాన్ని ఇనుమడింపజేసే వస్త్రాలు ధరించాలని మన పెద్దలు చెబుతారు. కానీ పాశ్చాత్య మోజులోపడి చిత్ర విచిత్రమైన అసహ్యకరమైన దుస్తులను ధరించి కోరికోరి సమస్యలు తెచ్చిపెట్టుకోవడం అవివేకం. నాగరికత పేరుతో వేలంవెర్రిగా ప్రవర్తించడం వల్ల నష్టమేతప్ప ఏవిధమైన ఉపయోగంలేదు.

మాట్లాడేటప్పుడు అమ్మ, అక్కా అని మొదలుపెడతాం అది మన పూర్వీకులు మన కందించిన సంస్కారం. ఈ గొప్ప గుణానికి ముగ్ధులై ఎందరో విదేశీయులు మన కట్టు, బొట్టు, సంస్కృతిని ఆచరిస్తూ మురిసిపోతుంటారు. పుట్టపర్తి, అరుణాచలం లాంటి క్షేత్రాలను దర్శిస్తే ఈ విషయం ఇంకాబాగా అర్థమవుతుంది. వారేమో మనవైపు చూస్తూ ఉంటే. మనం మాత్రం పాశ్చాత్య మోజులో జోగుచున్నాం, ఈ పరిస్థితి ఎంతదాకా వెళ్ళిందంటే ప్రముఖ పుణ్యక్షేత్రాలలో సాంప్రదాయ దుస్తులనే ధరించాలి, లేకపోతే ప్రవేశం కల్పించము. అని బోర్డులుకూడా పెట్టేశారు.

స్త్రీలు చీర, చుడిదార్ మొ॥ పురుషులు జుబ్బా–పైజామా, శుభకార్యాలలో దోవతి–పంచ ధరించవలెను. పిల్లలకు ఈ విషయాల గురించి చెప్పే గురుతర బాధ్యత తల్లిదండ్రులు, ఉపాధ్యాయులపైన ఎంతైనా ఉన్నది.

మంచి దుస్తులు ధరించండి మన్ననలు పొందండి.

మరిన్ని వివరాలకు శాస్త్రీయంగా **'సాత్విక వస్త్రధారణ'** పుస్తకాన్ని చదవండి.

**" భరించలేకపోతున్నాను అనుకుంటే దాన్ని ఎదురించి పోరాడు...**
**పోరాడలేకపోతున్నాను అంటే దాన్ని భరించి బ్రతుకు ! "**

# ॥ మమ్మీ... ॥ అలా అనొద్దు

**వింత మోజును వదలండి**




**జన్మనిచ్చిన తల్లిని 'ఎండుపీనుగ' అను అర్థాన్నిచ్చే 'మమ్మీ' అని పిలవకండి**

**సొంత విలువను మరువకండి**




**'ఓం' కు పర్యాయ రూపం 'అమ్మ' అందుకే 'అమ్మా' అనే పిలవండి**

ఒక పిల్లవాడు పుట్టాలంటే నవమాసాలు మోసి జన్మనిస్తుంది తల్లి. బిడ్డకోసం తన సర్వస్వాన్ని దారపోయడానికి ఏనాడు వెనుకాడదు. సృష్టిలో ఏ బాంధవ్యములోనైనా చెడు ఉండొచ్చు గాని తల్లి బాంధవ్యమెపుడూ చెడు ఉండదు. పిల్లల్ని కని, పెంచి, పెద్దచేసి, ప్రయోజకులుగా చేయడానికి తల్లి పడే ఆరాటం అంతాఇంతా కాదు. ఆ తల్లి ఈ రోజు 'మమ్మీ' అని పిలిపించుకోవడానికి సంబర పడిపోతోంది. ఇదేం చోద్యమో అర్థంకావటం లేదు. వ్యక్తి చనిపోయిన తరువాత ఆ శవం కుళ్ళకుండా ఉండడానికి రసాయనాలు పూసి భద్రపరుస్తారు. అలాంటి శవాన్ని మమ్మీ అంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే **'ఎండుపీనుగా'** అని అర్థం. మీరు పంచిన ప్రేమకు ప్రతిఫలంగా **'ఎండుపీనుగా'** అని పిలిపించుకోవడం కరెక్టా? కాదు. అందుకే కమ్మనైన అమ్మా అనే పిలిపించుకుందాం.

ఓం సృష్టిలో పుట్టిన మొదటి శబ్ధం దానిని మరో విధంగా పిలిచే శబ్దమే అమ్మా ప్రతి మంత్రానికి మొదట ఓం ఉంటుంది. ఓం లేకపోతే ఆ మంత్రానికి శక్తివుండదు. అంతటి ఓంను అమ్మ పదంతో జోడించారు మన పూర్వులు. అంతటి మహిమాన్విత మధురమైన పిలుపునొదిలేసి **ఎండుపీనుగా (మమ్మీ)** అని ఎందుకు పిలిపించుకోవాలి ?

మమ్మీ-డాడి వద్దేవద్దు అమ్మానాన్న ముద్దేముద్దు .

అధిక వివరాలకు **'భాషా భావం'** పుస్తకాన్ని చదవండి.

**" నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః "**
**అసత్యానికి అస్తిత్వముండదు - సత్యమనే అస్తిత్వం లేకుండా ఉండదు.**

# దేవస్థానములో దర్శనము చేసుకునే యోగ్యమైన పద్ధతి

## దైవ దర్శనానికి ముందు ఏమి చేయవలెను ?



- సాంప్రదాయ దుస్తులతో గుడికెళ్ళాలి. సెల్‌ఫోన్‌ఆపేయాలి.
- పాదరక్షలను దేవస్థానం బయట ఎడమవైపు విడవవలెను
- కాళ్ళు కడిగే సౌకర్యముంటే కాళ్ళు కడుక్కొని **'అపవిత్రః పవిత్రో వా'** అంటూ తలపై 3 సార్లు నీళ్ళు చల్లుకోవలెను.
- దేవస్థాన ప్రాంగణం నుండి కలశానికి నమస్కరించవలెను. దేవస్థానం లోపలికి వెళ్ళునప్పుడు నమస్కరిస్తూ వెళ్ళవలెను.
- దేవస్థానం మెట్లు ఎక్కునప్పుడు కుడిచేతి వేళ్ళతో మెట్లను తాకి అదే చేతివేళ్ళతో భ్రూమధ్యలో తాకవలెను.
- ప్రవేశించుటకు ముందు ముఖద్వారానికి నమస్కరించవలెను.

మరిన్ని వివరాలకు 'దేవస్థాన దర్శనము' పుస్తకాన్ని చదవండి

**దైవములో పేద, గొప్ప, మంచి, చెడు, హెచ్చు, తగ్గులు ఉండవు.**

## దైవ దర్శనము ఎలా చేసుకోవలెను ?



- దేవస్థానంలో గంటను తక్కువ శబ్దంతో మ్రోగించవలెను.
- దేవుని మూర్తి ఎదురు ఉన్న తాబేలు (శివుని గుడిలో నంది) ప్రక్కన చేతులు జోడించి నిలబడి దర్శనము చేసుకొనవలెను.
- మొదటి దేవుని చరణాలపై దృష్టిపెట్టి లీనంకావలెను, తరువాత దేవుని ఛాతిపై మనస్సు నిలుపవలెను. చివరకు దేవుని కళ్ళను చూసి ఆ రూపాన్ని కళ్ళల్లో నిలుపుకోవలెను.
- పువ్వులను దేవునిపై విసిరివేయకుండా చరణాలకు సమర్పించవలెను. మూర్తి దూరంగా ఉంటే వాటిని దేవుని ఎదుట ఉండే పళ్లెంలో ఉంచవలెను.

మరిన్ని వివరాలకు 'దేవస్థాన దర్శనము' పుస్తకాన్ని చదవండి

**భ్రమ తొలిగినవాడే జ్ఞాని - భ్రమలో ఉన్నవాడు అజ్ఞాని**

" మూడు వేళ్లతో దానం చేస్తే - ఐదు వేళ్ళతో తినవచ్చును " - క్షేత్రమెరిగి విత్తనం పాత్రయెరిగి దానం ఉత్తమం

# దేవస్థానములో అయోగ్య పనులు చేసి దేవతల ఆగ్రహానికి గురికాకండి !

## ప్రదక్షిణలు ఎలా చేయవలెను ?



卐 ప్రదక్షిణలు చేయడానికి ముందు దేవునికి ప్రార్థన చేయవలెను.

卐 చేతులుజోడించి భావపూర్ణంగా నామజపము చేస్తూ మధ్యమ వేగంతో గర్భగుడిని తాకకుండా ప్రదక్షిణలు చేయవలెను.

卐 ప్రదక్షిణలు చేస్తున్నప్పుడు గర్భగుడి వెనక చేరుకున్న ప్రతిసారి కొంత సమయమును నిలబడి, దేవునికి నమస్కరించవలెను.

卐 దేవుడికి సరిసంఖ్యలో (ఉదా : 2,4) మరియు అమ్మవారికి బేసి సంఖ్యలో (ఉదా : 1,3) ప్రదక్షిణలు చేయవలెను.

卐 ప్రతి ప్రదక్షిణ తరువాత నిలబడి దేవునికి నమస్కరించవలెను,

మరిన్ని వివరాలకు **'దేవస్థాన దర్శనము'** పుస్తకాన్ని చదవండి

**నీవెంట చివరికి వచ్చేది ఆస్తి-పాస్తులు కావు, నీ సంస్కారం ఒక్కటే.**

## ప్రదక్షిణల తరువాత ఏమి చేయవలెను ?



卐 దేవునికి శరణాగతి భావంతో నమస్కరించి ప్రార్థించవలెను.

卐 కుడి చేతిలో తీర్థము స్వీకరించిన తరువాత అదే చేతి మధ్యవేలు మరియు ఉంగరపు వేలితో అరచేతిని స్పర్శించి వేళ్ళను కళ్ళకి తాకించి నుదురు నుండి మెడ వరకు నిమురుకొనవలెను.

卐 దేవస్థానములో కూర్చొని కొంత సమయం జపము చేయవలెను. ప్రసాదమును దేవస్థానములోనే సేవించవలెను.

卐 తిరిగి వెళ్ళేటప్పుడు మరొక్కసారి దేవుని ప్రార్థించవలెను. బయటకు వచ్చిన తరువాత ప్రాంగణం నుండి మరొక్కసారి కలశమునకు నమస్కరించవలెను.

మరిన్ని వివరాలకు **'దేవస్థాన దర్శనము'** పుస్తకాన్ని చదవండి

**నీవు చేసే పుణ్యము వలన ఆనందము, పాపము వలన దుఃఖము ప్రాప్తించును.**

సత్వగుణాన్ని వృద్ధి చేసుకో – రజో గుణాన్ని అదుపులో ఉంచుకో – తమో గుణాన్ని త్యజించు

**శాస్త్రమును తెలుసుకొని విధులు నిర్వర్తించండి. నిజమైన ఆనందాన్ని పొందండి.**

## దేవునికి నమస్కరించు యోగ్య పద్ధతి




- సాష్టాంగ నమస్కారం కుదరనప్పుడు రెండు చేతులను జోడించి నమస్కరించవలెను.
- రెండు అరచేతులను ఒక దానితో మరొకటి జోడించవలెను.
- బొటనవేలు, మిగితా వేళ్ళు కొంతదూరం ఉంచవలెను.
- మెడ మరియు వీపును కొద్దిగా ముందుకు వంచి బొటన వేళ్ళను భ్రూమధ్యపై ఉంచి కొంత సమయము మనస్సును భగవంతుని పాదాలపై నిలపవలెను. (చిత్రం1)
- ఆ తరువాత చేతి మణికట్టును హృదయ మధ్యభాగమునకు తాకివుంచి తరువాత కిందకి దించవలెను. (చిత్రం2)




మరిన్ని వివరాలకు **'నమస్కార పద్ధతులు'** పుస్తకాన్ని చదవండి

**సిరి కలిగిన వాడికి, పదవి ఉన్న వారికి అందరూ బందువులే.**

## బొట్టు (కుంకుమ) ఎందుకు పెట్టుకోవలెను ?




కుంకుమ సూక్ష్మ-చిత్రము

కుంకుమ పెట్టుకోవటం వలన బ్రహ్మాండంలోని చైతన్యము ఆకర్షితమై భావము జాగృతమగును. అలాగే దుష్టశక్తుల నుండి రక్షణ అగును.

ఏకాగ్రత, ఆత్మవిశ్వాసము పెరుగును. చూచుటకు లక్షణంగా ఉండెదరు అందుకే స్త్రీలు బొట్టు బిళ్ళలు కాకుండా కుంకుమను పెట్టుకోవలెను.

**పద్ధతి :** పురుషులు భ్రూమధ్య పై తమకు, ఇతరులకు తిలకము పెట్టేటప్పుడు మధ్యవేలితో నిలువుగా తిలకాన్ని పెట్టవలెను. స్త్రీలు కుంకుమ పెట్టుకునేటప్పుడు తమ భ్రూమధ్య (నుదుటి) పై ఉంగరపు వేలితో ఇతరులకు పెట్టేటప్పుడు మధ్యవేలితో గుండ్రంగా కుంకుమ పెట్టవలెను.

మరిన్ని వివరాలకు **'తిలక ధారణ'** పుస్తకాన్ని చదవండి

**" విద్యకు గురువు చాలు, విశ్వాసమునకు దైవము చాలు "**

**ప్రేమించే వ్యక్తికే - దండించే అధికారం - ఓర్పు చేదుగా ఉండవచ్చు - ఫలితం తీయగానే ఉంటుంది.**

## ఏజాతి తమ చరిత్రను మరిచిపోతుందో ... అది కాలగర్భంలో కలిసి పోతుంది.




### భారతీయ వినాశనానికి 'డెవిల్ మెకాలే' మరణ శాసనం...

అప్పటికే 11 వందల సంవత్సరాలు నిరంతరాయంగా ముస్లిం దురాక్రమణదారులు దోచుకున్నప్పటికీ 1835లో భారతదేశం స్వరూపం అప్పటి బ్రిటీష్ గవర్నర్ "మెకాలే" మాటల్లోనే..

"నేను భారతదేశం మొత్తం పర్యటించినా ఒక బిక్షగాన్ని గాని దొంగను గాని చూడలేదు సిరిసంపదలతో తులతూగుచున్న దేశాన్ని మాత్రమే చూశాను. అత్యున్నత మానవ విలువలు, సమర్థమైన జ్ఞానవంతులను చూసిన తరువాత ఎప్పటికీ ఆ దేశాన్ని (భారత్) మనం ఆక్రమించలేమని అనిపించింది. దాన్ని గెలవాలంటే దేశానికి వెన్నెముకైన ఆధ్యాత్మికత, సంస్కృతి సంప్రదాయాలను దెబ్బతీయాలి. వాటి కంటే పాశ్చాత్య సంస్కృతి, ఆంగ్ల భాష గొప్పదని చాటాలి. వారి ఆత్మగౌరవాన్ని కోల్పోయే విద్యా విధానాన్ని ప్రవేశపెడితే... వారు మన చెప్పు చేతల్లోకి వస్తారు. అప్పుడు మనం ఆ దేశాన్ని (భారత్) ఆక్రమించి పాలించు కోగలుగుతాం."

నేటికీ ఈ ఉచ్చునుండి బయటకు రాకపోవడమే మన దౌర్భాగ్యానికి కారణం, దేశానికి శాపం. రండి పూర్వవైభవ స్థితిని పొందటానికి మన మూలాలను రక్షించుకుందాం. పూర్వీకుల త్యాగాలను సార్థకం చేద్దాం.

**బలహీనులే అవకాశం కోసం ఎదురుచూస్తారు, బలవంతులు సృష్టిస్తారు.**

### తామసిక ఇంగ్లీష్ - సాత్విక తెలుగు సూక్ష్మ పరీక్ష

'హలో' మరియు 'నమస్కారం' అంటున్నప్పుడు జరిగే సూక్ష్మప్రక్రియ

'హలో' అంటున్నప్పుడు కలుగు ఇబ్బందికర పరిణామము




'నమస్కారం' ఈ ఉచ్చారణ నుండి కలిగే లాభము




**మితిమీరిన ఆశలు, మతిచెడిన ఊహలు మనిషికి గతి లేకుండా చేస్తాయి.**

'ముల్లును ముల్లుతోనే తీయాలి, శతృశేషంలేకుండాచెయ్యాలి' అనే చాణక్యుని అనుసరిస్తే నీజాతి తిరిగి పూర్వ వైభవాన్ని సంతరించకుంటుంది.

... పూర్వ వైభవాన్ని సంతరించుకుంటుంది.

## సత్యం తెలుసుకుందాం... సంతోషంగా ఉందాం.




అనాదిగా భారతదేశంలో గురుకుల విద్యావిధానం అమలులో ఉండేది. రాజు బిడ్డ దగ్గరి నుండి కడు పేదవాళ్ల పిల్లల వరకు అందరూ కులాలకతీతంగా ఒకేదగ్గర చదువుకునేవారు. కట్టెలు కొట్టడం, నీళ్లు తేవడం, మొక్కలు పెంచడం, గోవులుకాయడం, ధ్యానము, మొ॥ అన్నీ చదువులో భాగాలే. జీవితాల్ని తీర్చిదిద్దే గురువుతో వినయ విధేయతలతో ఉంటూ వారి అనుగ్రహం ద్వారా అన్నీ విద్యలు అలవోకగా నేర్చుకునేవారు. సమాజం పట్లపూర్తి అవగాహనకలిగి ప్రతిభావంతులుగా, నీతిమంతులుగా ఆరోగ్యంతో ఆనందంగా జీవించేవారు.

ఈ దేశ వైభవానికి మూలాధారమైన గురుకులాలను సర్వనాశనం చేసి వాటిస్థానంలో ఇంగ్లీష్ మీ. కాన్వెంట్లను ప్రవేశపెట్టి వ్యక్తిత్వం లేని వ్యక్తులను నిర్మించడంలో విజయం సాధించారు బ్రిటీష్‌వారు. నల్లతోలు కలిగి తెల్లవారిలా ఆలోచించే మన స్వార్థ రాజకీయ నాయకులు, మేధావులు నేటికి ఈ ఉచ్చును ఛేదించకపోవడమే మన దురదృష్టం.

**జాతి రత్నాలుగా తయారుచేసే గురుకులాల్లోనే మీ పిల్లలను చేర్పించండి**

**మాతృభూమికై శ్రమనీ, కష్టాన్నీ సహించగల పుత్రులను తయారుచేయడమే లక్ష్యం.**

### మాతృభాష లో చదువు - మరెంతో సులువు




కేవలం ఆంగ్ల భాష వ్యామోహమే నేటి ఈ దేశ దుస్థితికి ప్రధాన కారణం. అన్నం పెట్టే రైతు, ఇల్లుకట్టే తాపీమేస్త్రీ, మొ॥ దేశ అవసరాలు తీర్చే 99%మంది ప్రజలకు మాతృభాష ఉపయోగకరం. విదేశీ అవసరాల నిమిత్తం కేవలం ఒక శాతం ప్రజానీకానికి ఆంగ్లం వస్తే సరిపోతుంది. వాస్తవానికి నేడు చైనా, జపాన్, ఇజ్రాయెల్ మొ॥ దేశాలు వారి మాతృభాషలోనే విద్యా బోధన చేయడం వల్ల అభివృద్ధి చెందిన దేశాలుగా మారాయి. మాతృభాషలో చదువుకోవడం సులభం. కేవలం భాషా అడ్డంకివల్లే ఎందరో మేధావులు పైకిరావడం లేదు.

పాలకులు విదేశీ భాషలో న్యాయస్థానాలు, కార్యలయాలు, పాలన జరపడం వల్ల 99% మంది ప్రజలను మోసం చేయగలుగుచున్నారు. తెలుగులో వోట్లు అడిగి ఇంగ్లీషులో పాలన చేయటం న్యాయమా? మాతృ భాషలో పాలన, బోధన జరిగే విధంగా ఉద్యమిద్దాం మాతృభాషను రక్షించుకొందాం. మాతృ భాషలోనే మాట్లాడుదాం, చదువుకుందాం.

కేవలం మాతృ(సంస్కృత)భాష తెలుసుకోనందుకే కోట్ల సంవత్సరాలుగా మన పూర్వీకులు సంపాదించి పెట్టిన జ్ఞానమంతా బూడిదలో పోసిన పన్నీరైంది.

**" మాతృభాషను మించిన మాధుర్యం పరభాషలో లేదు "**

ఈ పుస్తకములోని విషయాలతో కూడిన **"మన సంస్కృతి"** ఎగ్జిబిషన్ ను కళాశాలల్లో, జాతర్లలో, వివిధ కార్యక్రమాలలో ప్రదర్శించుటకు సంప్రదించండి.

# హైందవ చైతన్యమే భారత సంక్షేమం - భారత సంక్షేమమే విశ్వకళ్యాణము



ఇప్పటి వరకు ఉగ్రవాదమునకు 1 లక్షమంది బలి అయ్యారు, అలాగే 4లక్షల మంది నిరాశ్రితులయ్యారు మరియు నక్సల్ వాదము నుండి 15 వేలమంది ప్రాణాలు కోల్పోయారు 4.25 లక్షల మంది ప్రజలు నిరాశ్రితులయ్యారు.

**ఇలాంటి అసురక్షిత జీవితానికి బాధ్యులెవ్వరు ?**

అధికారము కొరకు అల్పసంఖ్యాకులను బుజ్జగించే, ఉగ్రవాదులకు ఆశ్రయ మిచ్చే, బుద్ధిలేని, లౌకికవాది రాజకీయ నాయకుల **నిరర్థక ప్రజాప్రభుత్వము!**

ప్రపంచం మొత్తాన్ని ఇస్లాం మతంలోకి మార్చలని రక్తసిక్త మార్గంలో నడుచుచున్నదే ఉగ్రవాదం. మతోన్మాద శక్తుల ప్రోద్బలంతో భారదేశంలో నరమేధం కొనసాగిస్తున్నారు. గత 20 సంవత్సరాలలో 50వేల మంది బలైనారు, కాశ్మీర్‌నుండి గెంటివేయబడ్డ 4 లక్షల మంది హిందువులు వారి ఆస్తిపాస్తులు, ఉద్యోగాలు సర్వస్వం వదులుకుని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బిక్కుబిక్కు మంటూ దుర్భరజీవితం గడుపుచున్నారు. మేలుకోకపోతే ఈ పరిస్థితి మనదాకా చేరే సమయం ఎక్కువ దూరంలేదు. మొన్న దిల్‌సుక్ నగర్ బాంబ్ పేలుళ్లలో చదువుకునే పిల్లలు, ఉద్యోగస్తులు, విహారానికెళ్లిన ఎందరో చనిపోయారు. ఈరోజు లేక రేపు మనం కాని, మన పిల్లలుకాని ఇలాంటి ఘటనలకు బలికారని గ్యారంటీ ఉందా ?

మన మాన, ప్రాణ,ఆస్తుల రక్షణకు హిందూ దేశ స్థాపనే మార్గం

**దుర్మార్గాన్ని ఎదుర్కొనుటకు ప్రాణాన్ని ఫణంగాపెట్టి పోరాడాల్సిందే**

**ప్రపచంలో కనీసం ఒక్క హిందూ దేశాన్నైనా మీరు కనుగొనగలరా... ?**




| దేశములు | వయస్సు | సంఖ్య |
|---|---|---|
| క్రైస్తవ | 2000 | 153 |
| ఇస్లాం | 1420 | 52 |
| బౌద్ధ | 2630 | 12 |
| యూదు (జ్యూ) | 3800 | 1 |
| కుహానా లౌకిక (భారత్ నేపాల్) | 40 | 2 |
| హిందూ | 196 కోట్లు | 0 |

2 వేల సంవత్సరాల క్రితం పుట్టిన క్రైస్తవ మతం 153 దేశాలను ఏలుతోంది. 14 వందల సంవత్సరాల క్రితం పుట్టిన ఇస్లాం మతం 52 దేశాలను ఏలుతోంది. 196 కోట్ల సంవత్సరాల చరిత్ర కలిగి ప్రపంచానికంత జ్ఞానాన్నందించిన ఉన్నతమైన హిందూ ధర్మము పాలనలో ఒక్క దేశం కూడా ఎందుకు లేదు? ఆలోచించండి ప్రపంచంలో ప్రతి దేశంలో మెజార్టీ మతస్థుల మత ఆచారాలను కాపాడుతారు. కానీ భారతదేశం హిందూ మెజార్టీ దేశమైనప్పటికీ ఇక్కడ హిందువుల, హిందూ ఆచారాల రక్షణ జరుగదు. హిందువులకే అన్యాయం జరుగును.

ఒకవేళ ఈదేశంలో క్రైస్తవాచార వ్యవహారాలు జరగకపోతే అక్కున చేర్చుకొని ఆదరించడానికి 153 క్రైస్తవదేశాలు ముందుకు రావచ్చు, ముస్లింలకు 52 దేశాలు బాసటగా నిలువవచ్చును కాని హిందువుల ఆచార సాంప్రదాయాలు జరుగకపోతే దిక్కేది. అందుకైనా భారతదేశాన్ని "హిందూ దేశం" గా నిర్మించడం చాలా అవసరం.

**" నిర్జీవమైన ఐక్యత జాతి పతనానికి నిదర్శనం "**

**తన తల్లి వక్షంపై ఒక రాక్షసుడు కూర్చుని ఆమె నెత్తురుని త్రాగుతుంటే ఏ కొడుకైనా ఏమి చెయ్యాలి ?**


ముడుచుకు కూర్చొంటే ముక్కలవును దేశం.
కాశ్మీర్, అస్సాం, మిజోరం, నాగాలాండ్, త్రిపుర, మేఘాలయ, మణిపూర్, అరుణాచల్ ప్రదేశ్ రాష్ట్రాల్లో పరిస్థితులు చేజారేలా ఉన్నాయి. ఇకనైనా మేలుకోకపోతే మిగిలేది ఏమిటి ?
నాటి అఖండ భారతం
76,56,300 చ.కి.మీ. వైశాల్యం
నేడు ముక్కలుగా మిగిలిన ఖండిత భారతం
31,59,450 చ.కి.మీ. వైశాల్యం
పాక్ తీవ్రవాదం
అదునుకోసం వేచిచూస్తున్న చూస్తున్న చైనా డ్రాగన్
మేలుకోకపోతే రేపటి భారతం ఎంత ?
దేశం కోల్పోయిన భూభాగం
1. అఫ్ఘాన్ - 6,52, 100 చ.కి.మీ
2. పాకిస్థాన్ - 7, 96, 100 చ.కి.మీ
3. శ్రీలంక - 65,600 చ.కి.మీ
4. బర్మా (మయన్మార్) - 6,76,600 చ.కి.మీ
5. బంగ్లాదేశ్ - 1,44,000 చ.కి.మీ
6. టిబెట్ - 25, 00,000 చ.కి.మీ
7. నేపాల్ - 1,40,800 చ.కి.మీ
8. భూటాన్ - 45, 600 చ.కి.మీ
పాక్ ఆక్రమించిన కాశ్మీరం - 78,114 చ.కి.మీ
చైనా ఆక్రమించిన కాశ్మీరం - 35, 555 చ.కి.మీ
చైనాకు పాక్ దారాదత్తం చేసిన కాశ్మీరం - 5,180 చ.కి.మీ
పొరుగు దేశమైన చైనా భూభాగం రోజురోజుకు పెంచుకుంటుంటే మనం మాత్రం కుచించుకు పోతున్నాం....
ఎవరిది లోపం, ఎందుకు శాపం ?
“ బాహుబలం లేని బుద్ధిబలం నిర్వీర్యం - సద్బుద్ధి లేని బాహుబలం పాశవికం. సైనిక బలము కన్న - నైతిక బలమే మిన్న ”



We Salute to Awardese of PARAMA VEERA CHAKRA. Your spirit always dwells in our hearts
Lt-Col. Ardeshir Burzorji Tarapore
లెఫ్టినెంట్ కల్నల్ ఎ.బి. తారాపోరే
Lance Naik Albert Ekka
లాన్స్ నాయక్ ఆల్బర్ట్ ఎక్కా
Lieutenant Arun Khetarpal
లెఫ్టినెంట్ అరుణ్ ఖేతర్పాల్
Captain Manoj Kumar Pandey
కెప్టెన్ మనోజ్ కుమార్ పాండే
Grenadier Yogendra Singh Yadav
గ్రేనడియర్ యోగేంద్ర సింగ్ యాదవ్
Rifleman Sanjay Kumar
రైఫిల్‌మ్యాన్ సంజయ్ కుమార్
Captain Vikram Batra
కెప్టెన్ విక్రమ్ బాత్రా
Lt. Rama Raghoba Rane
లెఫ్టినెంట్ రామ రఘోబా రానే
Havildar Abdul Hamid
హావల్దార్ అబ్దుల్ హమీద్
Major Piru Singh Shekhawat
మేజర్ పీరూ సింగ్
Major Hoshiar Singh
మేజర్ హోషియర్ సింగ్
Major Ramaswamy Parameshwaran
మేజర్ పరమేశ్వరన్
Naib Subedar Bana Singh
నాయబ్ సుబేదార్ బానా సింగ్
Captain Gurbachan Singh Salaria
కెప్టెన్ గురుచరణ్ సింగ్ సలారియా
Naik Jadu Nath Singh
జాదూనాథ్ సింగ్
Lance Naik Karam Singh
కరమ్ సింగ్
Major Somnath Sharma
మేజర్ సోమనాథ్ శర్మ
Major Dhan Singh Thapa
మేజర్ ధన్‌సింగ్ తాపా
Major Shaitan Singh
మేజర్ సైతాన్ సింగ్
Subedar Joginder Singh
సుబేదార్ జోగేందర్ సింగ్
దేశ రక్షణకై ప్రాణార్పణ చేసిన మహనీయులే మనకు ఆదర్శం...
" పూర్వజన్మలో సైనికులం, కొత్త ఆశయంతో చిగురించాం సమరభూమిలో పోరాడిన మేము కర్మభూమిలో అడుగెట్టాం
భారతమాత ప్రీతి పుత్రులం, సదా ఆమెను పూజిస్తాం అఖండ భారత పునరుద్ధరణే ఊపిరిగా జీవిస్తాం... "

"భారతమాత ప్రతి పుత్రులం, సదా ఆమెను పూజిస్తాం అఖండ భారత పునరుద్ధరణే ఊపిరిగా జీవిస్తాం..."

## ప్రపంచంలోని వివిధ సంస్కృతులు - జాతులు




**ఏడు ఖండాలు**

ఆసియా, ఆఫ్రికా, యూరప్, ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, అంటార్కిటికా

**డబ్ల్యు.బి.స్పార్క్స్ యొక్క చారిత్రక పటం ఆధారంగా బి.సి. 2000 సం॥లు నుండి ఎ.డి. 1975 వరకు వివిధ ప్రాచీన నాగరికతల జీవనకాలం సూచించే వివరాలు**

| నాగరికత | నుండి - వరకు (ఆయుష్షు) |
| --- | --- |
| సుమేరియా | బిసి 2300 - 2200 (100 సం॥) |
| ఏజియా బిసి | బిసి 2000 - 1150 (850 సం॥) |
| హిట్టైట్ | బిసి 2000 - 950 (1050 సం॥) |
| అమొరైట్ | బిసి 2000 - 400 (1600 సం॥) |
| బాబిలోనియా | బిసి 2000 - 400 (1600 సం॥) |
| పర్షియా | బిసి 2000 - 250 (1750 సం॥) |
| ఈజిప్ట్ | బిసి 2000 - 150 (1850 సం॥) |
| హూన్ | బిసి 2000-ఎడి700 (2700 సం॥) |
| అస్సీరియా | బిసి 1450 - 500 (950 సం॥లు) |
| గ్రీస్ | బిసి 1450 - 50 (1400 సం॥లు) |
| ఫొనేసియా | బిసి 1450 - ఎ.డి. 200 (1650 సం॥లు) |
| రోమ్ | బిసి 800 - ఎ.డి. 500 (1300 సం॥లు) |
| చైనా | బిసి 2000 - ఇప్పటి వరకు... |

భారత్ (సింధు) బిసి కంటే కోట్ల సం॥ల ముందు నుండి ఇప్పటికీ....

క్రైస్తవ మతం పుట్టకంటే ముందు వివిధ మతాల నాగరికతలు మనుగడలో ఉండేవి. క్రైస్తవ - ఇస్లాం మతాల పుట్టిన తర్వాత మత విస్తరణకోసం ప్రలోభాలు, ఆక్రమణలు,కుట్రలు మొదలగు అనేక అరాచకాలవల్ల వందల కోట్ల నరమేధం జరగటంతో పాటు. ఎన్నో జాతులు కాలగర్భంలో కలిసిపోయి చరిత్రలో మాత్రమే నిలిచిపోయాయి. కానీ గత 2500 సం॥లుగా మనపై ఎన్ని దాడులు జరిగినా ఇప్పటికీ చెక్కుచెదరకుండా

**నిలచిఉన్న ఏకైక సనాతన ధర్మం మనది. దానిని కాపాడటం మన కర్తవ్యం!**

(బి.సి., ఎ.డి.లు కేవలం వాడుక కాలమాన సౌలభ్యతకొరకే వాడుటమైనది.)

**పుట్టిన ప్రతిది (మతము) గిట్టక తప్పదు - కేవలం సనాతన హైందవ ధర్మము మాత్రమే సజీవమైన ధర్మము.**

"తల ఉన్నవాడికి తలనొప్పి సహజం - సంపదలు ఉన్నవారికే సమస్యలు సహజం"


ఋషి ముని పరంపరలో నైతిక విలువలతో శక్తిసంపన్నంగా విరాజిల్లిన
(ప్రాచీన కాలంనాటి) భారతావని పునరుద్ధరణే మాధ్యేయం !
శ్లో॥ రత్నాకరా ధౌతపదాం
హిమాలయ కిరీటినీమ్।
బ్రహ్మరాజర్షి రత్నాఢ్యాం
వందే భారత మాతరమ్॥
హిందూ మహాసముద్రం పాదాలు కడుగుతుండగా
హిమాలయం కిరీటము కాగా,
బ్రహ్మర్షి, రాజర్షులను
రత్నాలుగా అలంకరించుకున్న
భారతమాతకు వందనములు !
" మన పూర్వీకుల రక్తం మనలోను ప్రవహిస్తున్నది, వారి శౌర్య పరాక్రమాలను ప్రదర్శించి దేశాన్ని కాపాడుదాం" - చలసాని బలరామయ్య, ఫోన్ : 9246562996

## హిందువులను అణిచివేయడమేనా సెక్యులరిజం ? ఇదేనా సమానత్వం ?

### హిందువులకు 'అ'న్యాయం :

- ఒక్క భార్య ఇద్దరు పిల్లలు అంతే, కుటుంబ నియంత్రణ పాటించాలి. 1950లో 90% ఉన్న హిందూ జనాభా నేడు 80%లోపే ఉంది.
- తిరుపతి, మానససరోవరం, బద్రినాథ్ సమ్మక్క సారక్క జాతరలు మొ॥ యాత్రలకు సర్‌చార్జీలు, పండుగలైతే స్పెషల్(డబల్) చార్జీలు.
- ప్రభుత్వం హిందువుల దేవాలయాలు, మఠాలను స్వాధీనం చేసుకొని, వాటి ఆస్తులను, భక్తులు సమర్పించిన ముడుపులు,కానుకలను ముస్లింల మక్కాయాత్రకు, ఇతరములకు విచ్చలవిడిగా ఖర్చు పెడుతుంది. దేవాలయాలు కట్టుకోవడానికి పైసాకూడా ఇవ్వదు.
- కాశ్మీర్, అస్సాం, మిజోరాం, నాగాలాండ్ మొ॥ రాష్ట్రాలలో హిందువులు మైనారిటీలు కానీ ముస్లింలు, క్రైస్తవులకిచ్చినటువంటి రిజర్వేషన్స్ లేవు.
- అన్నీ నేరాలకు హిందూ శిక్షాస్మృతి ప్రకారం ఒకే శిక్ష అమలు చేస్తారు. (ఒకేదేశంలో, ఒకే నేరం చేసినవారికి రెండు రకాలుగా శిక్షలు ప్రపంచంలోనే విచిత్రం)
- భూతద్దంలో వెతికినా ప్రపంచానికి కనబడని కాషాయ(హిందూ) తీవ్రవాదం అత్యంత ప్రమాదమని పాపం కాంగ్రెస్ పార్టీ ప్రకటించినది.
- 50 వేలమందిని చంపి, అత్యాచారాలు చేసి, ఆస్తులు లాక్కొని నాలుగు లక్షల హిందువులను కాశ్మీర్ నుండి తరిమేస్తే పట్టించుకొనే నాధుడేలేడు.




### ముస్లిం - క్రైస్తవులకు న్యాయం :

- ఎక్కువ మందిని పెళ్లిచేసుకోవడం తప్పుకాదు. కుటుంబ నియంత్రణ అక్కర్లేదు 1950లో 10% ఉన్న ముస్లిం జనాభా నేడు 20% పైనే ఉంది.
- ప్రపంచంలో ఏ ఒక్క (చివరకు ముస్లిం దేశంకూడా) దేశం ఇవ్వని మక్కా 'హజ్ యాత్రకు సబ్సిడి' ఇప్పటిదాకా 10వేల కోట్లు ఇచ్చింది.
- ప్రభుత్వం మసీదులు, చర్చిలు, ఆస్తుల విషయంలో పొరపాటున కూడా వాటి జోలికెళ్ళదు. వాటిపై ఈగ వాలితే కూడా ఊరుకోదు. చర్చి, మసీద్‌లు కట్టుకోవడానికి ఆం.ప్ర కాంగ్రెస్ ప్రభుత్వం 2 లక్షలు ఆర్థిక సాయం చేసింది.
- మైనార్టి పేరుతో దేశంలో రకరకాల తాయిలాలు, రిజర్వేషన్‌లు ఇస్తుంది. చాలక దేశంలోని సహజ వనరులపై మొదటి హక్కు మైనారటీలదే అని కాంగ్రెస్ ప్రధాని మన్మోహన్ ప్రకటన
- ముస్లింల సివిల్ నేరాలకు ఇస్లాం చట్టం ప్రకారం(ఇందులో తక్కువ శిక్షలు), క్రిమినల్ నేరాలకు హిందూ శిక్షాస్మృతి ప్రకారం శిక్ష అమలు చేస్తారు
- ప్రపంచాన్ని గడగడ వణికిస్తూ నరమేధం సాగిస్తున్న ఇస్లామిక్ తీవ్రవాదాన్ని ఉక్కుపాదంతో అణచకపోగా ఉగ్రవాదానికి మతం ఉండదని ప్రకటన.
- తప్పోప్పులతో ప్రమేయం లేకుండా దేశంలో ఎక్కడ ఘర్షణలు జరిగినా ముస్లిం క్రైస్తవులకు బాసటగా రాజకీయ నాయకులుంటారు.

**100 కోట్ల హిందువుల్లారా కళ్లుతెరవండి హిందువులను పట్టించుకునే నాయకుడికే ఓట్ వేయండి.**
**లేకుంటే మీగతి, మీ పిల్లల గతేంటో ఊహించండి ఇలాంటి అనేక వివరాల కోసం 'నివురుగప్పిన నిజాలు' పుస్తకం చదవండి**

## రాజకీయ కుతంత్రాలతో ఎప్పటికీ స్వేచ్ఛ రాదు.... హిందూ చైతన్యం ద్వారానే అదిసాధ్యం..

### ఇదెలా సమానం ?




నేను తప్ప వేరే దేవుడు ఉండకూడదు, విగ్రహారాధన చేసే వాళ్లని, మా దేవున్ని నమ్మని వాణ్ణి చంపండి అని క్రైస్తవ, ఇస్లాం మత బోధనలలో భాగం. వారి రాజ్యల స్థాపనకై రక్తాన్ని ఏరులుగా పరుగెత్తించిన చరిత్రను చదివితే తెలుస్తుంది. అందులోనుంచి పుట్టిందే ఉగ్రవాదం.

అంతటా నేనే ఉన్నాను ఏ రూపంతో కాని, ఏ పేరుతో గాని పిలిచినా నాకే చేరుతుంది అని హిందూ ధర్మం చెబుతుంది. ఇది నక్కకూ నాగలోకానికి ఉన్నంత తేడా వున్ననూ కొంతమంది స్వాములు, రాజకీయ నాయకులు వారి పబ్బం గడుపుకోవడం కోసం అన్నీ మతాలు సమానమని కేవలం హిందువులనే లక్ష్యంగా చేసుకుని ప్రచారంతో మోసంచేస్తున్నారు. అయోమయ స్థితిలో హిందూ సమాజం నిర్వీర్యమవుతోంది.

**హిందువుల్లారా సత్యాన్ని గ్రహించండి.**

**"ప్రేమించే వ్యక్తికే దండించే అధికారం ఉండాలి"**

### ఇది స్వాతంత్ర్యమా? కుతంత్రమా ?



1) భారతదేశాన్ని ఇండియా అనే పిలవాలి 2) సుభాష్ చంద్రబోస్ పట్టుబడితే బ్రిటీష్ వారికి అప్పగించాలి. 3) క్రైస్తవ మతమార్పిళ్లకు సౌకర్యాలు ఇవ్వాలి. 4) ఎల్లకాలం మనలను బానిసలుగా చేసే ఉద్దేశ్యంతో ప్రవేశ పెట్టబడిన విద్యావిధానం అమలవ్వాలి. 5) కార్యాలయాల్లో ఇంగ్లీషు భాషనే ఉపయోగించాలి, ప్రోత్సహించాలి 6) బ్రిటిషర్స్ చేసిన పాలసీలు, పన్నుల విధానాలు, చట్టాలే అమలవ్వాలి.

బ్రిటీష్‌వారు భారతదేశాన్ని శాశ్వతంగా బానిసదేశంగా మార్చడానికి పెట్టిన అనేక దారుణమైన షరతులను ఒప్పుకొని 'ట్రాన్స్‌ఫర్ ఆఫ్ పవర్' అగ్రిమెంటుపై సంతకం చేసి అధికారాన్ని చేజికిచ్చుకున్న నెహ్రూ దానినే స్వాతంత్ర్యం అని ప్రజలను మభ్యపెట్టారు.

దీనిని స్వాతంత్ర్యం అంటారా? కేవలం అధికార దాహంతో ప్రాకులాడే మన పాలకుల విధానంలో ఈ నాటికీ ఏ మార్పు రాకపోవడమే మన దేశానికి శాపం.

**ఈ ప్రపంచం యుక్తులు కలిగినవారి సొంతం**

**తల్లి ఒడి ప్రథమ బడి, ఒక అవసరాన్ని గుర్తించి దాన్ని తీర్చడానికి ప్రయత్నించు. స్వీయ లోపములు తెలుసుకునటయే పెద్ద విద్య.**

